

శ్రీమతే రామానుజాయ నమః

# వరదరాజపంచాశత్



శ్రీవరదరాజస్వామి, కాంచీపురం




'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గ శింగరాచార్యులు


సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచానూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# వరదరాజపంచాశత్

అవతారిక:

ఈ స్తుతి శ్రీవరదరాజస్వామిని ఉద్దేశించి దేశికులచే రచింపబడింది. ఇందులో 50శ్లోకాలున్నాయి. అందువల్ల దీనికి వరదరాజ పంచాశత్ అనే పేరు వచ్చింది.

కంచి స్వయంవ్యక్తక్షేత్రం. ముక్తిదాయకాలుగా పురాణాలలో చెప్పబడిన ఏడింటిలో కంచి ముఖ్యమైనదని దేశికుల అభిప్రాయం. దీనికి శ్రీవైష్ణవసంప్రదాయంలో "పెరుమాళ్ కోయిల్" అని పేరు. ఇక్కడ భగవానుడు ఒక చిన్న కొండపై వేంచేసి ఉన్నాడు. దీనికి హస్తిగిరి అని పేరు. ఈ క్షేత్రంలో చేసే వ్రతాదులకు ఫలం తప్పక లభిస్తుంది. అందువల్ల దీనికి సత్యవ్రతక్షేత్రమనే పేరు కలిగింది. ఇక్కడి స్వామికి సంస్కృతభాషలో వరదుడని, దేవరాజస్వామి అని, దేవాధిరాజు అని, ద్రావిడభాషలో అరుళాళన్, పేరరుళాళన్, దేవప్పెరుమాళ్ అని పేర్లున్నాయి.

ఇక్కడ భగవానుడు వరదరాజస్వామిగా ఆవిర్భవించిన వృత్తాంతం చాలా అద్భుతమైనది. పూర్వం కృతయుగంలో బ్రహ్మ భగవానుని సాక్షాత్తుగా సేవించగోరి చాలా తీవ్రమైన తపస్సు చేశాడు. అయినా అతని తపస్సు ఫలించలేదు. అపుడు ఒక అశరీరవాణి మాటను అనుసరించి బ్రహ్మ సత్యవ్రతక్షేత్రానికి వెళ్ళి, అక్కడ హస్తిగిరిని యజ్ఞవేదికగా చేసికొని అశ్వమేధయాగం చేశాడు. ఆ యాగవేదికమధ్యనుండి ఒక గొప్ప తేజస్సు. అందులోనుండి పుణ్యకోటివిమానం ఆవిర్భవించాయి. ఆ విమానం మధ్యలోనుండి తేజోమయుడైన వరదరాజస్వామి ప్రత్యక్షమయ్యాడు. ఆ స్వామిని

దర్శించి ఆనందాన్ని పొందిన బ్రహ్మ కోరిక తీరింది. ఆ క్షేత్రంలోనే అర్చారూపంలో చిరకాలం వేంచేసి ఉండవలసినదిగా వరదరాజస్వామిని బ్రహ్మ అర్థించాడు. భగవానుడు ఆ విధంగానే కంచిలో నిత్యనివాసాన్ని ఈనాటికీ కలిగి ఉన్నాడు.

ఈ విధంగా కృతయుగంలోనే అర్చారూపాన్ని ధరించిన వరదునకు ప్రతిసంవత్సరం వైశాఖ మాసంలో బ్రహ్మోత్సవాన్ని బ్రహ్మ జరిపేవాడనే ఐతిహ్యం ఉన్నది. ప్రత్యేకించి కంచిగరుడసేవకుండే ప్రసిద్ధి ఇక ఏ సేవకు లేదు.

దేశికులవతరించిన తూప్పుల్ అగ్రహారం కంచికి సమీపంలోనే ఉన్నది. మిగిలిన స్తోత్రాలలో కనుపించని కొన్ని విశేషాలను దేశికులు ఈ స్తుతిలో పొందుపరచారు. ఇందులో వరదరాజస్వామిని ఉపనిషత్తులు కీర్తించే రీతిలో స్తుతించడంతోనే దేశికులు నిలువలేదు. బ్రహ్మోత్సవంలోని వాహనాలు, రథం, పల్లకి మొదలైనవానిలో వరదుడు వేంచేసే వైభవాన్నికూడా ఇందులో వర్ణించారు దివ్యాభరణాలు, కవచం మొదలైనవానిని తొలగించినపుడు ఉండే అర్చామూర్తిసన్నివేశాన్ని, శయనమందిరంలో పెరుందేవిత్తాయార్ తో కలసి ఉండేటపుడు ఏర్పడే చిహ్నాలతో పాటు స్వామి అక్కడనుండి వేంచేసే సన్నివేశాన్ని సేవించాలని తాము ఆశపడినట్లుకూడా ఇందులో వర్ణించారు. వరదుని దివ్యసౌందర్యాన్ని నిరంతరం సేవించగలిగితే ఇక వైకుంఠవాసంకూడా తమకు అక్కరలేదని దేశికులు ప్రతిజ్ఞ చేస్తూ ఈ స్తుతిలో పల్కడం విశేషం.

1) ద్విరదశిఖరి సీమ్నాసద్మవాన్ పద్మయోనేః,
**తురగసవనవేద్యాం శ్యామలో హవ్యవాహః ।**
**కలశజలధికన్యావల్లరీకల్పశాఖీ**
**కలయతు కుశలం నః కోऽపి కారుణ్యరాశిః ॥**

హస్తిగిరిశిఖరాన్ని నివాసంగా కలవాడు, తన నాభీపద్మంలో పుట్టిన బ్రహ్మ చేసిన అశ్వమేధయాగంలో నల్లని వర్ణాన్ని కల అగ్నియై ఆవిర్భవించినవాడు, పాలకడలిలో పుట్టిన లక్ష్మి. అనే లతతో కూడిన కల్పవృక్షంవంటివాడు, గొప్ప కరుణయే మూర్తీభవించినవాడైన శ్రీవరదరాజస్వామి మనకు క్షేమాన్ని కలిగించాలి.

2) **యస్యానుభావమధిగన్తుమశక్నువన్తో,**
**ముహ్యన్త్యభఙ్గురధియో మునిసార్వభౌమాః ।**
**తస్యైవ తే స్తుతిషు సాహసమశ్నువానః**
**క్షన్తవ్య ఏష భవతా కరిశైలనాథ ॥**

హస్తిగిరినాథా! అడ్డు లేని జ్ఞానాన్ని కల గొప్ప మునులుకూడా నీ మహిమను తెలిసికోలేనివారై, మోహాన్ని పొందుతున్నారు. అటువంటి నిన్ను స్తుతించడమనే సాహసాన్ని చేయాలని ప్రయత్నించే నన్ను క్షమించు.

3) **జానన్ననాదివిహితానపరాధవర్గాన్**
**స్వామిన్భయాత్కిమపి వక్తుమహం న శక్తః ।**
**అవ్యాజవత్సల తథాపి నిరఙ్కుశం మాం**
**వాత్సల్యమేవ భవతో ముఖరీ కరోతి ॥**

సర్వేశ్వరా! అనాదికాలంగా నేను చేసిన పాపరాసులను తెలిసికొన్న నేను భయంవల్ల నీ మహిమనుగూర్చి ఏమీ పలుకడానికి సమర్థుడను కాలేకున్నాను. సహజమైన కృపను కలవాడా! దోషాలను గమనించకపోవడమనే నీ వాత్సల్యగుణమే నిరంకుశుడనైన నన్ను ఏ అడ్డు లేకుండా నిన్ను స్తుతించేటట్లు చేస్తున్నదిసుమా!

4) **కిం వ్యాహరామి వరద స్తుతయే కథం వా**
**ఖద్యోతవత్త్వలఘుసఙ్కుచిత ప్రకాశః ।**

తన్మే సమర్పయ మతిఞ్చ సరస్వతీఞ్చ
త్వామఞ్జసా స్తుతిపదైర్యదహం ధినోమి ॥

వరదా! మిణుగురుపురుగువలె చాలా అల్పమైన ప్రకాశాన్ని(జ్ఞానాన్ని) కల నేను నిన్ను స్తుతించాలంటే ఏమి పలుకగలను?ఏ విధంగా పలుకగలను? అందువల్ల నిన్ను నేను స్తుతివచనాలతో ఏ విధంగా బాగా సంతోషింపజేయగలనో, ఆ విధమైన జ్ఞానాన్ని, వాక్కును నాకు అనుగ్రహించు.

5) మచ్ఛక్తిమాత్రగణనే కిమిహాస్తి శక్యం,
శక్యేన వా తవ కరీశ కిమస్తి సాధ్యమ్ ।
యద్యస్తి సాధయ మయాతదపి త్వయా వా
కిం వా భవేద్ భవతి కిఞ్చిదనీహమానే ॥

హస్తిగిరినాథా! నా శక్తిని మొత్తం గమనించి చూస్తే ఈ లోకంలో నేను చేయగలిగినది ఏమున్నది? ఒకవేళ చెయ్యగలిగినది ఏదయినా ఉన్నా నీకు దానివల్ల కలిగే ప్రయోజనం ఏమున్నది ? అటువంటి ప్రయోజనం ఏదయినా ఉంటే నాచేత దానిని చేయించుకో. అదికూడా నీచేతనే చేయబడినది అవుతుంది. నీవు దేనినైనా చేయాలని అనుకోకపోతే ఆ పని ఏవిధంగా అవుతుంది? (కాదుకదా! )

6) స్తోత్రం మయా విరచితం త్వదధీన వాచా,
త్వత్ప్రీతయే వరదయత్తదిదం న చిత్రమ్ ।
ఆవర్జయన్తి హృదయం ఖలు శిక్షకాణాం
మఞ్జూని పఞ్జరశకున్తవిజల్పితాని ॥

వరదా! నీ ఆధీనంలో ఉండే వాక్కులను కల నేను చేసే ఈ స్తుతి నీకు ఆనందాన్ని కలిగిస్తున్నది. –అనే ఈ విషయం ఆశ్చర్యమేమీ కాదు. వినడానికి

ఇంపుగా ఉండే, పంజరంలోని చిలుక పలికే తీయని పలుకులు నేర్పించేవారి మనసుకు రుచిస్తాయికదా!

7) **యం చక్షుషామవిషయం హయమేథయజ్వా**
**ద్రాఘీయసా సుచరితేన దదర్శ వేధాః ।**
**తం త్వాం కరీశ కరుణా పరిణామతస్తే**
**భూతాని హన్త నిఖిలాని నిశామయన్తి ॥**

హస్తిగిరినాథా! బాహ్యనేత్రాలకు గోచరించని నిన్ను బ్రహ్మ అశ్వమేధయాగాన్ని చేసినవాడై, గొప్ప పుణ్యాన్ని సంపాదించి, నిన్ను దర్శించాడు. అటువంటి నిన్ను నీ కరుణవల్ల కలిగిన పరిణామం కారణంగా జనులందరు దర్శిస్తున్నారు. ఆశ్చర్యం!

8) **తత్తత్పదైరుపహితేఽపి తురఙ్గమేధే,**
**శక్రాదయో వరద పూర్వమలబ్ధభాగాః ।**
**అధ్యక్షితే మఖపతౌ త్వయి చక్షుషైవ**
**హైరణ్యగర్భ హవిషాం రసమన్వభూవన్ ॥**

వరదా! అశ్వమేధయాగం ఆ యా పలు దేవతలను నిర్దేశించే పదాలతో కూడినది అయినా, మొదట తమ తమ హవిర్భాగాలను పొందని ఇంద్రాదిదేవతలు, యాగాధిపతివి అయిన నీవు అక్కడకు వచ్చినపుడు బ్రహ్మ ఇచ్చిన ఆ హవిస్సుల. రసాన్ని (హవిస్సుల సారమైన నిన్ను) తమ నేత్రాలతో అనుభవించారు. (చూచారు)

9) **సర్గస్థితిప్రళయవిభ్రమనాటికాయాం**
**శైలూషవద్వివిధవేషపరిగ్రహం త్వామ్ ।**

సమ్భావయన్తి హృదయేన కరీశధన్యాః
సంసారవారినిధి సన్తరణైకపోతమ్ ॥

కరిగిరినాథా! సృష్టిస్థితిలయాలనే లీలా నాటకంలోని నటులవలె పలు విధాలైన వేషాలను ధరించేవాడవైన నిన్ను సంసారమనే సముద్రాన్ని దాటడానికి సాధనమైన సాటి లేని నావగా భాగ్యవంతులు తమ చిత్తంలో నిరంతరం ధ్యానిస్తారు.

10) ప్రాప్తోదయేషు వరద త్వదనుప్రవేశాత్
పద్మాసనాదిషు శివాదిషు కఞ్చుకేషు ।
తన్మాత్ర దర్శనవిలోభిత శేముషీకాః
తాదాత్మ్య మూఢమతయో నిపతన్త్యధీరాః ॥

వరదా! యథార్థజ్ఞానం లేనివారు నీవు లోపల ప్రవేశించి ఉన్నందున జన్మించి నిలచి, తమ తమ కార్యాలను నిర్వహించే బ్రహ్మ, శివుడు మొదలైనవారు –వీరంతా నీ కంచుకంవంటివారు. –అని తెలిరలేరు. వారిని ఆ విధంగా తెలియలేని అవివేకులు వారితో సమానుడవని నిన్ను భావించేవారై, మూఢులై పతనం చెందుతున్నారు.

11) మధ్యే విరిఞ్చిశివయోర్విహితావతారః
ఖ్యాతోఽపి తత్సమతయా తదిదం న చిత్రమ్ ।
మాయావశేన మకరాది శరీరిణం త్వాం
తానేవ పశ్యతి కరీశ యదేష లోకః ॥

కరీశా! బ్రహ్మకు, శివునకు మధ్య విష్ణువై అవతరించిన నీవు వారితో సమానుడవని చెప్పబడుతున్నావు. ఈ విషయం ఆశ్చర్యకరం కాదు. ఎందుకంటే, నీ సంకల్పంతోనే మత్స్యాదిరూపాలను పరిగ్రహించే నిన్ను ఈ లోకం సరిగా గ్రహించలేక సాధారణమైన మత్స్యం మొదలైనవానినిగానే తలుస్తున్నది.

12) బ్రహ్మేతి శఙ్కర ఇతీన్ద్ర ఇతి స్వరాడి-
త్యాత్మేతి సర్వమితి సర్వచరాచరాత్మన్ ।
హస్తీశ సర్వవచసామవసానసీమాం
త్వాం సర్వకారణముశన్త్యనపాయవాచః ॥

జంగమస్థావరాలకు అన్నిటికి అంతర్యామివి అయిన వరదా! నిత్యాలైన వేదవాక్కులు సర్వకారణరూపుడవైన నిన్ను బ్రహ్మవని, శివుడవని, ఇంద్రుడవని, కర్మలకు వశం కాని స్వరాట్ అని, ఆత్మ అని, సర్వమని, అన్ని శబ్దాలకు అపర్యవసానవృత్తిద్వారా పరమావధి అయిన అర్థమని పలుకుతున్నాయి.

13) ఆశాధిపేషు గిరిశేషు చతుర్ముఖేష్వ-
ప్యవ్యాహతా విధినిషేధమయీ తవాజ్ఞా ।
హస్తీశ నిత్యమనుపాలనలఙ్ఘనాభ్యాం
పుంసాం శుభాశుభమయాని ఫలాని సూతే ॥

హస్తిగిరినాథా! దిక్పాలకుల విషయంలో, రుద్రుల విషయంలో, చతుర్ముఖుల విషయంలో ఏ అడ్డు లేకుండా విధినిషేధాల రూపంలో సాగే నీ ఆజ్ఞను నిత్యంగా నెరవేర్చడంవల్ల, అతిక్రమిఃచడంవల్ల మానవులకు శుభఫలాలు, ఆశుభఫలాలు కలుగుతాయి.

14) త్రాతాఽపది స్థితిపదం భరణం ప్రరోహః
ఛాయాకరీశ సరసాని ఫలాని చ త్వమ్ ।
శాఖాగతత్రిదశబృన్దశకున్తకానాం
కిం నామ నాసి మహతాం నిగమద్రుమాణామ్ ॥

హస్తిగిరినాథా! (వేదభాగాలనే ) శాఖలలో (దేవతల బృందాలనే) పక్షులను కల గొప్ప వేదాలనే వృక్షాలను నీవు ఆపత్కాలంలో కాపాడేవాడవుగా, అవి వేళ్ళు ఊనుకొనే చోటుగా, పోషించే వస్తువుగా, వాటి మొలకగా, నీడగా, తీయని ఫలంగా ఉన్నావు. ఇక నీవు వాటికి ఏమి కావు ?(అన్నీ నీవే)

15) సామాన్య బుద్ధిజనకాశ్చసదాదిశబ్దాః,
తత్త్వాన్తరభ్రమకృతశ్చ శివాదివాచః ।
నారాయణే త్వయి కరీశవహన్త్యనన్యం
అన్వర్థవృత్తిపరికల్పితమైకకణ్ఠ్యమ్ ॥

హస్తిగిరినాథా! జగత్కారణవిషయంలో సామాన్యబుద్ధిని (బ్రహ్మశివాదులలో ఎవరైనా జగత్కారణం కావచ్చు "–అనే బుద్ధిని)కలిగించే సత్, బ్రహ్మ, ఆత్మాది శబ్దాలు, నీకంటే ఇంకొక పరదేవత ఉన్నదనే భ్రమను కలిగించే శివాదిశబ్దాలు నారాయణుడవైన నీ విషయంలో యుక్తమైన అర్థాన్ని తెలిపే అపర్యవసానవృత్తి సామర్థ్యంచేత చక్కగా ఏర్పడిన, వేరెవ్వరికీ చెందని రీతిలో ఐకకంఠ్యంతో అన్వయించి నీలోనే పర్యవసిస్తున్నవి. (అన్ని శబ్దాలు అర్థంలో నీవరకు పర్యవసించి, నిన్ను తెలుపుతున్నవి)

16) సఞ్చిన్తయన్త్యఖిలహేయవిపక్షభూతం
శాన్తోదితం శమవతాహృదయేన ధన్యాః ।
నిత్యం పరం వరదసర్వగతం సుసూక్ష్మం
నిష్పన్దనన్దథుమయం భవతస్స్వరూపమ్ ॥

వరదా! భాగ్యవంతులు ఇంద్రియనిగ్రహాన్ని కల తమ మనసుతో అన్ని హేయగుణాలకు ప్రతిభటుమై, నిత్యమై, గొప్పదై, అంతటా వ్యాపించి ఉండేదై,

సూక్ష్మమైన, మారని ఆనందస్వరూపమై ఉండే నీ దివ్యాత్మస్వరూపాన్ని శాంతోదితదశను పొందినదిగా చక్కగా ధ్యానిస్తున్నారు.

17) విశ్వాతిశాయిసుఖరూప యదాత్మకస్త్వం
వ్యక్తిం కరీశ కథయన్తి తదాత్మికాం తే ।
యేనాధిరోహతి మతిస్త్వదుపాసకానాం
సా కిం త్వమేవ తవవేతి వితర్కడోలామ్ ॥

హస్తిగిరినాథా! లోకంలో అంతటా గొప్పదైన ఆనందస్వరూపుడవై ఉండేవాడా! నీ దివ్యాత్మస్వరూపం ఏవిధంగా జ్ఞానానందమయమై ఉన్నదో ఆ విధంగానే నీ దివ్యమంగళరూపంకూడా జ్ఞానానందమయమై ఉన్నది. ఆ విధంగానే వేదాలుకూడా పలుకుతున్నాయి. అందువల్ల నిన్ను ధ్యానించే భక్తుల బుద్ధి నీ ఆ తిరుమేనిని దర్శించి, అది నీ రూపమా??లేక, నీ దివ్యాత్మస్వరూపమా? అనే సందేహాన్ని పొందుతున్నారు.

18) మోహాన్ధకారవినివర్తనజాగరూకే
దోషాదివాపి నిరవగ్రహమేధమానే ।
త్వత్తేజసి ద్విరద శైలపతే విమృష్టే
శ్లాఘ్యేత సన్తమసపర్వసహస్రభానోః ॥

హస్తిగిరినాథా! అజ్ఞానమనే చీకటిని పోగొట్టడంలో మెలకువగా ఉన్నది, రాత్రి, పగలు అనే తేడా లేకుండా వృద్ధి అవుతున్నది అయిన నీ తేజస్సును పరిశీలించి చూచినపుడు, అది వేయి కిరణాలను కల సూర్యుని తేజస్సుకూడా చీకటి అనేటట్లున్నది.

19) రూఢస్య చిన్మయతయా హృదయే
కరీశ స్తమ్బానుకారిపరిణామ విశేషభాజః ।
స్థానేషు జాగ్రతి చతుర్ష్వపి సత్త్వవన్తః
శాఖా విభాగ చతురే తవ చాతురాత్మ్యే ॥

వరదా! సత్త్వగుణాన్ని కల మహాత్ములు తమ హృదయంలో —జ్ఞానరూపంగా ఆవిర్భవించినవాడవై, తృణాగ్రంవంటి రూపాన్ని పొందినవాడవై, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులనే నీ నాలుగు రూపాలలో —ఒక్కొక్క రూపంలో నాలుగు నాలుగు రూపాలను పొంది, వాటితో జీవుల జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయాలనే దశలను నాల్గింటిని నిర్వహించేవాడవైన నిన్ను శ్రద్ధతో ధ్యానిస్తారు.

20) నాగాచలేశ నిఖిలోపనిషన్మనీషా
మఞ్జూషికా మరకతం పరిచిన్వతాం త్వామ్
తన్వీ హృది స్ఫురతి కాపి శిఖామునీనాం
సౌదామనీవ నిభృతా నవమేఘగర్భా ॥

హస్తిగిరినాథా! అన్ని ఉపనిషత్తుల అభిప్రాయమనే(ఉపనిషత్తుల అర్థమనే) పెట్టెలో ఉండే మరకతమణివంటి నిన్ను ఉపాసించే మునుల హృదయంలో ఒక నూతనమేఘాన్ని తన మధ్యలో కల, నిశ్చలంగా ఉండే మెరపుతీగవలె భాసించే, చాలా గొప్ప విలక్షణమైన జ్వాల ప్రకాశిస్తున్నది. (జ్వాలవంటి నీ రూపం భాసిస్తున్నది)

21) ఔదన్వతే మహతి సద్మని భాసమానే
శ్లాఘ్యే చ దివ్యసదనే తమసః పరస్తాత్ ।
అన్తః కళేబరమిదం సుషిరం సుసూక్ష్మం
జాతం కరీశ కథమాదరణాస్పదం తే ॥

కరిగిరినాథా! నీ గొప్ప నివాసమైన క్షీరాబ్ధి, ప్రకృతిమండలానికి ఆవలి వైపున ఉండే, కీర్తించదగిన వైకుంఠమనే స్థానం – అనేవి ఉండగా, జీవుల శరీరంలోపల ఉండే, చాలా చిన్నదైన ఈ ద్వారం నీకు ఏవిధంగా ఆదరించదగిన నివాసం అయినది?

22) బాలాకృతేర్వటపలాశమితస్య యస్య
బ్రహ్మాణ్డమణ్డలమభూదుదరైకదేశే ।
తస్యైవ తద్వరద హన్త కథం ప్రభూతం
వాలాహమాస్థితవతో వపురద్భుతం తే ॥

వరదా! చిన్న బాలుని రూపాన్ని పొందినవాడవై, మర్రి ఆకులో ఇమిడి ఉండేవాడవైన నీ చిన్న బొజ్జలోని చిరుబాగంలో బ్రహ్మాండాల సమూహం అంతా ఇమిడిపోయింది. అటువంటి నీవు అద్భుతమైన వరాహరూపాన్ని ఎత్తినపుడు నీ వరాహరూపం ఇమిడేటట్లుగా ఏ విధంగా దానికంటే బ్రహ్మాండసమూహం పెద్దది అయినది? ఆశ్చర్యం!

23) భక్తస్య దానవ శిశోః పరిపాలనాయ
భద్రాం నృసింహకుహనామధి జగ్ముషస్తే ।
స్తమ్భైక వర్జమధునాపి కరీశ నూనం
త్రైలోక్యమేతదఖిలం నరసింహగర్భమ్ ॥

కరీశా! నీ భక్తుడైన దానవబాలకుని (ప్రహ్లాదుని)కాపాడడంకోసం అందమైన, మాయానృసింహరూపాన్ని పొందిన నీ ముల్లోకాలలోని వస్తువులలో, నీవు అవతరించిన ఒక స్తంభంతప్ప, మిగిలినవి అన్నీ ఇప్పటికీ నృసింహరూపాన్ని తమ గర్భంలో కలిగి ఉన్నాయిసుమా! ఇది నిశ్చయం.

24) క్రామన్ జగత్కపటవామనతాముపేతః
త్రేధాకరీశ స భవాన్నిదధే పదాని ।
అద్యాపిజన్తవ ఇమే విమలేన యస్య
పాదోదకేన విధృతేన శివా భవన్తి ॥

కరీశా! అటువంటి గొప్పతనాన్ని కల నీవు కపటమైన (బలిని వంచించే)వామనరూపాన్ని ధరించి, లోకాలను కొలువడంకోసం నీ చరణాలను మూడు విధాలుగా పెట్టావు. అపుడు పరిశుద్ధమైన. నీ శ్రీపాదతీర్థాన్ని తమ తలలపై ధరించిన ప్రాణులంతా శివులయ్యారు.

25) యేనాచల ప్రకృతినా రిపుసంక్షయార్థీ
వారాం నిధిం వరద పూర్వ మలఙ్ఘయస్త్వమ్ ।
తం వీక్ష్య సేతు మధునాపి శరీరవన్తః
సర్వే షడూర్మిబహుళం జలధిం తరన్తి ॥

వరదా! నీవు శ్రీరాముడవై అవతరించినపుడు లంకలోని శత్రువుల నాశాన్ని కోరేవాడవై పర్వతాలను సాధనంగా కల (చలించని స్వభావాన్ని కల పర్వతాలతో కట్టబడిన) ఏ వారధితో సముద్రాన్ని దాటావో, ఆ వారధిని దర్శించి ఇపుడుకూడా శరీరాన్ని ధరించిన ప్రాణులందరు ఆరు విధాలైన అలలను (బాధలను)కల సంసారసముద్రాన్ని దాటుతున్నారు.

.

26) ఇత్థం కరీశ దురపహ్నవదివ్య భవ్య
రూపాన్వితస్య విబుధాది విభూతి సామ్యాత్ ।
కేచిద్విచిత్రచరితాన్భవతోఽవతారాన్
సత్యాన్దయా పరవశస్య వదన్తి సన్తః ॥

కరీశా! ఈ విధంగా కప్పిపుచ్చడానికి వీలు లేని, శుద్ధసత్త్వమయమైన, భవ్యమైన రూపాలను కలవాడవై, కరుణకు వశుడవై నీవు ఎత్తే అవతారూపాలు, దేవతలు మొదలైన నీ విభూతిలో చేరినవారి రూపాలతో సామ్యాన్ని కలిగి ఉన్నందున, విచిత్రమైన చరిత్రలను కల నీ ఆ అవతార రూపాల తత్త్వాన్ని కొందరు మహాత్ములు మాత్రమే తెలిసికొంటున్నారు.

27) **సౌశీల్య భావితధియా భవతా కథఞ్చిత్**
**సఞ్ఛాదితానపి గుణాన్వరద త్వదీయాన్ ।**
**ప్రత్యక్షయన్త్యవికలం తవ సన్నికృష్టాః**
**పత్యుస్త్విషామివ పయోదవృతాన్మయూఖాన్ ॥**

వరదా! సౌశీల్యగుణాన్ని చూపడంకోసం సంకల్పించిన నీవు శ్రమపడి మిగిలిన నీ కల్యాణగుణాలను మరగుపరచుకొన్నా, ఆ గుణాలను నీకు సన్నిహితులైన భక్తులు, తేజస్సులకు ప్రభువైన సూర్యుని కిరణాలనువలె, అవి మేఘాలచే ఆవరింపబడినా, ఏ లోటు లేకుండా దర్శించగలుగుతున్నారు.

28) **నిత్యం కరీశ తిమిరావిల దృష్టయోఽపి**
**సిద్ధాఞ్జనేన భవతైవ విభూషితాక్షాః ।**
**పశ్యన్త్యుపర్యుపరి సఞ్చరతామదృశ్యం**
**మాయానిగూఢమనపాయ మహానిధిం త్వామ్ ॥**

కరీశా! కంటి దోషంవల్ల (పాపంవల్ల)కలత చెందిన దృష్టిని కలవారైనా, నీ తిరుమేని అనే సిద్ధాంజనంతో (సంస్కరింపబడిన)నేత్రాలను కల వారు పైపైన మాత్రమే సంచరించేవారికి గోచరించని, ప్రకృతి (భూమి ) సంబంధంచేత

మరగుపరచబడిన, ఏ నాటికీ నశించని నిధివై ఉండే నిన్ను (నీ దివ్యస్వరూపాన్ని) సదా దర్శిస్తారు.

29) సద్యస్త్యజన్తి వరద త్వయి బద్ధ భావాః
పైతామహాదిషు పదేష్వపి భావబన్ధమ్ ।
కస్మై స్వదేత సుఖసఞ్చరణోత్సుకాయ
కారాగృహే కనకశృఙ్ఖలయాఽపి బన్ధః ॥

వరదా! నీ విషయంలో భక్తిని కలవారు బ్రహ్మమొదలైనవారి అధికారాలలోకూడా ఆసక్తిని వెంటనే విడచిపెడుతున్నారు. స్వేచ్ఛగా సంచరించడంలో ఆశను కలవానికి చెరసాలలో బంగారు సంకెలతో బంధించినా సుఖం కలుగుతుందా?( కలుగదు)

30) హస్తీశ దుఃఖ విషదిగ్ధ ఫలానుబన్ధి
న్యాబ్రహ్మకీటమపరాహతసంప్రయోగే ।
దుష్కర్మ సఞ్చయవశాద్దురతిక్రమే నః
ప్రత్యస్త్రమఞ్జలిరసౌ తవ నిగ్రహాస్త్రే ॥

హస్తీశా! దుఃఖమనే విషంతో పూయబడిన ఫలాన్ని ఇచ్చేది, బ్రహ్మమొదలు కీటకంవరకు ఉండే ప్రాణులన్నీ తప్పించుకొనడానికి సాధ్యం కానిది, పాపసమూహంవల్ల కలిగేది అయిన నీ నిగ్రహమనే బాణానికి ప్రత్యస్త్రంగా మేము ఈ అంజలిని చేస్తున్నాము. (నీ నిగ్రహాన్ని మా అంజలియే సమాధానపరుస్తుంది)

31) త్వద్భక్తి పోతమవలమ్బితుమక్షమాణాం
పారం పరం గన్తుమనీశ్వరాణామ్ ।

**స్వైరం లిలఙ్ఘయిషతాం భవవారిరాశిం**
**త్వామేవ గన్తుమసి సేతురభఙ్గురస్త్వమ్ ॥**

హస్తిగిరీశా! నీ విషయంలోని భక్తి అనే నావను ఆశ్రయించడంలో సమర్థులు కానివారికి, సంసారసముద్రాన్ని తమ ఇష్టానుసారంగా దాటగోరేవారికి, గొప్ప తీరమై ఉండే నిన్ను చేరడానికి శక్తి లేనివారికి, నిన్ను చేరడానికి నీవే ఏ భంగం లేని, దృఢమైన సేతువై ఉన్నావు.

32) **అశ్రాన్త సంసరణ ఘర్మ నిపీడితస్య**
**భ్రాన్తస్య మే వరద భోగ మరీచికాసు 1 ॥**
**జీవాతురస్తు నిరవగ్రహమేధమానః**
**దేవ త్వదీయ కరుణామృతదృష్టిపాతః ॥**

దేవా! వరదరాజస్వామీ! ఏనాటికీ శాంతించని సంసారమనే గ్రీష్మకాలంచేత బాధింపబడేవాడనై, లౌకికసుఖాలలోని అనుభవమనే ఎండమావులలో తిరిగి అలసిపోయినవాడనైన నాకు ఏ అడ్డు లేకుండా వృద్ధి చెందే నీ కరుణ అనే అమృతం నిండిన కటాక్షాల ప్రసారం నన్ను ఉజ్జీవింపజేసే ఔషధంగా కావాలి.

33) **అన్తః ప్రవిశ్య భగవన్నఖిలస్య జన్తోః**
**ఆసేదుషస్తవ కరీశభృశం దవీయాన్ 1**
**సత్యం భవేయమధునాపి స ఏవ భూయః**
**స్వాభావికీ తవ దయా యది నాన్తరాయః ॥**

హస్తిగిరినాథా! కల్యాణగుణాలను కలవాడా! జీవులందరిలోపల ప్రవేశించి, వారికి చాలా సమీపంలో ఉండే నీకు చాలా దూరంలో ఉండే నేను, సహజమైన నీ

కరుణ అడ్డు లేకపోతే (నీవు కరుణించి ఉండకపోతే)ఇపుడుకూడా మళ్ళీ అటువంటివాడనై(నీకు దూరమైనవాడనై) ఉండేవాడను. ఇది నిజం

34) అజ్ఞాతనిర్గమమనాగమవేదినం మాం
అంధం న కించిదవలంబనమశ్నువానం
ఏతావతీం గమయితుః పదవీం దయోళోః
శేషాఘ్వలేశ నయనే క ఇవాతిభారః ॥

వరదా! బయటకు వెళ్ళే దారిని తెలియనివాడనై, వచ్చిన దారినికూడా తెలియనివాడనై, ఏ ఆలంబనాన్ని పొందనివాడనై, గుడ్డివాడనైన(అజ్ఞానిని అయిన) నన్ను ఇంతదూరం నడపించిన దయాస్వభావుడవైన నీకు ఇక మిగిలిన కొంచెం దూరం నన్ను నడిపించడంలో ఏమి ఎక్కువ భారం ఉన్నది?

35) భూయోపి హన్త వసతిర్యది మే
భవిత్రీ యామ్యాసు దుర్విషహవృత్తిషు యాతనాసు 1
సమ్యగ్భవిష్యతి తతశ్శరణాగతానాం
సంరక్షితేతి బిరుదం వరద త్వదీయమ్ ॥

వరదా! యముడు పెట్టే, భరించలేని బాధలను కలిగించే నరకయాతనలలో మళ్ళీ నాకు స్థితి ఏర్పడితే, దానివల్ల శరణు పొందినవారిని నీవు కాపాడేవాడవనే నీకుండే బిరుదు బాగానే కాబోతుంది. అయ్యో! (ఆ బిరుదు వ్యర్థమవుతుంది)

36) పర్యాకులం మహతి దుఃఖపయోనిథౌ మాం
పశ్యన్కరీశ యది జోషమవస్థితస్త్వమ్ 1
స్మారేక్షణేऽపి మిషతి త్వయి నిర్నిమేషం
పారే కరిష్యతి దయా తవ దుర్నివారా ॥

కరీశా! నీవు, గొప్ప దుఃఖసముద్రంలో చాలా వ్యాకులతను పొందిన నన్ను గమనించి చూచికూడా, మౌనంగా ఉంటే నీవు కనురెప్ప వేయకుండా బాగా తెరచిన కళ్ళతో చూస్తూ ఉన్నా, నీ కరుణ అనే (లక్ష్మి )అడ్డు పెట్టడానికి సాధ్యం కానిదై, సంసారసముద్రానికి ఆవలితీరంలో ఉండే నీదగ్గరకు తప్పక నన్ను చేరుస్తుందిసుమా!

37) కిం వా కరీశ కృపణే మయి రక్షణీయే
ధర్మాది బాహ్య సహకారి గవేషణేన ।
నన్వస్తి విశ్వ పరిపాలనజాగరూకః
సఙ్కల్పఏవ భవతో నిపుణస్సహాయః ॥

హస్తిగిరినాథా! నీవు తప్ప ఇక ఏ గతి లేని నన్ను రక్షించే విషయంలో నీవు నేను చేసే నిత్యనైమిత్తికాదులైన ధర్మాలు మొదలైన బాహ్యాలైన సహకారులను(ఉపాయాలను) వెదకడంవల్ల ఏమి లాభం?లోకాన్ని రక్షించడంలో మెలకువగా ఉండే నీ సంకల్పమే నైపుణ్యాన్ని కల సహాయంగా ఉన్నదికదా! (ఇక వేరే సహకారులెందుకు?)

38) నిర్యన్త్రణం పరిణమన్తి న యావదేతే
నీరన్ధ్ర దుష్కృతభవా దురితప్రరోహాః ।
తావన్నచేత్త్వముపగచ్ఛసి శార్ఙ్గధన్వా
శక్యం త్వయాపి న హి వారయితుం కరీశ ॥

హస్తిగిరీశా! నిరంతరం చేసిన దుష్కర్మలవల్ల కలిగే ఈ పాపాల అంకురాలు ఏ అడ్డు లేకుండా ఫలించడం ఆరంభించేలోగానే నీవు నీ శార్ ఙ్గమనే వింటిని ధరించి నా దగ్గరకు రాకపోతే, ఆ తరువాత వాటిని అడ్డుకోవడం నీకుకూడా సాధ్యం కాదు.

39) యావన్నపశ్యతి నికామమమర్షణో మాం
భ్రూభఙ్గ భీషణకరాల ముఖః కృతాన్తః ।
తావత్ప్రతన్తు మయి తే భగవన్ దయాళోః
ఉన్నిద్రపద్మకలికా మధురాః కటాక్షాః ॥

భగవన్! చాలా కోపాన్ని కలవాడు, కనుబొమల కదలికలతో భయంకరమైన, క్రూరమైన ముఖాన్ని కలవాడైన యముడు నన్ను చూడకముందే వికసించిన తామరమొగ్గలవంటి, చల్లని, కరుణ నిండిన నీ చూపులు నాపై పడాలి.

40) స త్వం స ఏవ రభసో భవథౌపవాహ్యః
చక్రం తదేవ సితధార మహం చ పాల్యః ।
సాధారణే త్వయి కరీశ సమస్త జన్తోః
మాతఙ్గమానుష భిదా న విశేష హేతుః ॥

కరీశా! నీవు ఇంతకుముందున్న స్వామివే. గొప్ప వేగాన్ని కల నీకు వాహనమైన గరుడుడుకూడా అదే వేగాన్ని కలవాడే. పదునైన అంచును కల సుదర్శనుడుకూడా ఆ విధంగా పదును. కలవాడే. నేనుకూడా గజేంద్రునివలె రక్షింపదగినవాడనే. ఆ విధంగా ఉన్నా, మరి, నీవు ప్రాణులందరికి సమానుడవై, రక్షకుడవైనపుడు, "ఇది గజం, ఇతడు మానవుడు"–అనే తేడా నీవు నన్ను విడువడానికి నీకు కారణం కాదు.

41) నిర్వాపయిష్యతి కదా కరిశైలధామన్
దుర్వారకర్మపరిపాక మహాదవాగ్నిమ్ ।
ప్రాచీనదుఃఖమపి మే సుఖయన్నివ త్వత్–
పాదారవిన్ద పరిచారరస ప్రవాహః ॥

హస్తిగిరిని నివాసంగా కలవాడా! నీ శ్రీచరణపద్మకైంకర్యంవల్ల వచ్చే ఆనందప్రవాహం నా పూర్వదుఃఖాన్నికూడా సుఖంగా చేస్తూ, అడ్డుకోవడానికి వీలు కాని నా కర్మల పరిణామమనే దావాగ్నిని ఎపుడు ఆర్పివేస్తుంది?

42) **ముక్తస్స్వయం సుకృతదుష్కృతశృఙ్ఖలాభ్యాం**
**అర్చిర్ముఖైరధికృతైరతివాహితాధ్వా** 1
**స్వచ్ఛన్ద కిఙ్కరతయా భవతః కరీశ**
**స్వాభావికం ప్రతిలభేయ మహాధికారమ్ ॥**

కరిగిరీశా! నా పుణ్యపాపాలనే సంకెళ్ళు అవి తాముగానే వీడిపోగా, వాటినుండి విముక్తుడనై, అర్చిస్సు మొదలైన అధికారులచే (ఆతివాహకులచే) తీసికొనిపోబడినవాడనై, నీకభిమతమైన రీతిలో కైంకర్యం చేయడమనే, సహజమైన, గొప్ప అధికారాన్ని నేను పొందాలి.

43) **త్వఞ్చేత్ప్రసీదసి తవాస్మి సమీపతశ్చేత్**
**త్వయ్యస్తి భక్తిరనఘా కరిశైలనాథ** 1
**సంసృజ్యతే యది చ దాసజనస్త్వదీయః**
**సంసారఏష భగవన్నపవర్గ ఏవ ॥**

కరిగిరిప్రభూ! కల్యాణగుణాలను కల భగవన్! నీవు ప్రసన్నుడవైతే, నీ దగ్గర ఉంటే, నీ విషయంలో దోషం లేని భక్తి ఉంటే, నీ భక్తుల సమూహంతో కూడి ఉంటే, ఈ సంసారమండలమే తప్పక మోక్షమైపోతుంది

44) **ఆహూయమానమనపాయవిభూతికామైః**
**ఆలోకలుప్త జగదాన్ధ్యమనుస్మరేయమ్** 1

ఆలోహితాంశుకమనాకుల హేతి జాలం
హైరణ్యగర్భహయమేధ హవిర్భుజం త్వామ్ ॥

నాశం లేని సంపదను కోరేవారిచే పిలువబడేవాడవై, (హోమం చేయబడేదై), కటాక్షాలతో (ప్రకాశాలతో)లోపించిన జగత్తులోని ఆంధ్యాన్ని కలవాడవై(చీకటిని కలిగినదై), పీతాంబరాన్ని ధరించినవాడవై (ఎర్రని కిరణాలను కలిగినదై, )కలత లేని దివ్యాయుధాలను కలవాడవై(పొగ కలవని జ్వాలలను కలిగినదై), బ్రహ్మ చేసిన అశ్వమేధయాగంలోని హవిస్సును స్వీకరించినవాడవైన (అగ్నివంటి) నిన్ను నిరంతరం స్మరిస్తాను

45) భూయోభూయః పులకనిచితైర ఙ్గకైరేధమానాః,
స్థూలస్థూలాన్నయనముకులైర్బిభ్రతో బాష్పబిన్దూన్ ।
ధన్యాః కేచిద్వరద భవతో సంసదం భూషయన్తః
స్వాన్తైరన్తర్వినయనిభృతైస్స్వాదయన్తే పదన్తే ॥

వరదా! పుణ్యశాలురైన కొందరు మహనీయులు నీ అనుభవంవల్ల మాటి మాటికి కలిగిన రోమాంచంతో నిండిన అవయవాలతో ఇంకా ఇంకా ప్రకాశించేవారై, మిక్కిలిగా పెద్దవి అయిన బాష్పబిందువులను వికసించిన నేత్రాలలో కలవారై, నీ గోష్ఠిని అలంకరించేవారై, వినయంతో కూడుకొన్న తమ మనసులతో. ఉండే నీ శ్రీపాదాలను ఇతరులకు రుచించేటట్లు (ఆశ్రయించేటట్లు) చేస్తున్నారు.

46) వరద తవ విలోకయన్తి ధన్యాః
మరకతభూధరమాతృకాయమాణమ్ ।
వ్యపగతపరికర్మ వారవాణం
మృగమదపఙ్కవిశేషనీలమఙ్గమ్ ॥

వరదా! దివ్యాభరణాలు, కవచం మొదలైన వానిని తొలగించిన సన్నివేశాన్ని కలిగినది, మరకతపర్వతానికి మూలరూపంవంటిది, కస్తూరిపంకంతో మిక్కిలి నల్లగా ఉన్నది అయిన నీ తిరుమేనిని భాగ్యవంతులు దర్శిస్తారు.

47) అనిభృతపరిరమ్భైరాహితామిన్దిరాయాః
**కనకవలయముద్రాం కణ్ఠదేశే దధానః ।**
**ఫణిపతిశయనీయాదుత్థితస్త్వం ప్రభాతే**
**వరదసతతమన్తర్మానసం సన్నిధేయాః ॥**

వరదా! ఆదిశేషుడనే శయ్యపై నుండి ప్రాతఃకాలంలో నిద్ర లేచిన సన్నివేశంలో నీవు, లక్ష్మీదేవియొక్క బిగికౌగిళ్ళవల్ల ఏర్పడిన, ఆమె చేతులలోని బంగారు వలయాల ముద్రలను కంఠంలో కలవాడవై, నా మనసులో సదా దర్శనాన్ని అనుగ్రహించాలి.

48) తురగవిహగరాజస్యన్దనాన్దోలికాది-
**ష్వధికమధికమన్యామాత్మశోభాం దధానమ్ ।**
**అనవధిక విభూతిం హస్తి శైలేశ్వరంత్వాం**
**అనుదినమనిమేషైర్లోచనైర్నిర్విశేయమ్ ॥**

అశ్వగరుడరథవాహనాలలో, తూగుటుయ్యేలలో వేరు వేరు రూపసౌందర్యాలను మిక్కిలిగా కలవాడవై, అంతు లేని వైభవాలను కలవాడవై, హస్తిగిరీశుడవైన నిన్ను రెప్పపాటు లేని కన్నులతో ప్రతిదినం సేవిస్తాను.

49) నిరన్తరం నిర్విశతస్త్వదీయం
**అస్పృష్ట చిన్తాపదమాభిరూప్యమ్ ।**
**సత్యం శపే వారణ శైలనాథ**
**వైకుణ్ఠవాసేఽపి న మేఽబిలాషః ॥**

హస్తిగిరినాథా! ప్రమాణం చేసి నిజం చెబుతున్నాను. మనసుతో చింతించడానికికూడా సాధ్యం కాని నీ మేనిసౌందర్యాన్ని నిరంతరం దర్శించే నాకు శ్రీవైకుంఠవాసంలో కూడా కోరిక లేదు

**50) వ్యాతన్వానా తరుణతులసీదామభిస్స్వామభిఖ్యామ్**
**మాతఙ్గాద్రౌ మరకతరుచిం పుష్ణతీ మానసే నః 1**
**భోగైశ్వర్యప్రియసహచరైః కాऽపి లక్ష్మీ కటాక్షైః**
**భూయశ్శ్యామా భువన జననీ దేవతా సన్నిధత్తామ్ ॥**

పచ్చని తులసీమాలికలవల్ల, మోక్షాన్ని, ఇహలోకసుఖాలను కలిగించే లక్ష్మీకటాక్షాలవల్ల ఇంకా నల్లని రంగును కలిగినది, తన కాంతిని అంతటా వ్యాపింపజేస్తున్నది, మరకతమణికాంతిని వృద్ధి పొందించేది(మించినది), జగత్కారణమై ఉండే అత్యద్భుతమైన దైవం అయిన వరదరాజస్వామి మన మనసులో సదా ప్రకాశించాలి.

**51) ఇతి విహితముదారం వేఙ్కటేశేన భక్త్యా**
**శ్రుతి సుభగమిదం యస్స్తోత్రమఙ్గీకరోతి 1**
**కరిశిఖరి విటఙ్క స్థాయినః కల్పవృక్షాత్**
**భవతి ఫలమశేషం తస్య హస్తాపచేయమ్ ॥**

ఈ విధంగా వేంకటేశులనే వేదాంతదేశికులచే రచింపబడినది, గొప్ప భావాలతో నిండినది, వినడానికి ఇంపైనది (వేదంవలె గొప్పది) అయిన ఈ స్తుతిని ఎవడు అంగీకరించి అనుసంధిస్తున్నాడో, అతనికి హస్తిగిరిశిఖరమనే అనే నందనోద్యానంలో ఉండే కల్పవృక్షంవల్ల (వరదునివల్ల)అన్ని ఫలాలు చేతులకు అందేటట్లుగా సులభంగా లభిస్తాయి.

వరదరాజపంచాశత్ సంపూర్ణమ్

★★★★★